THE ANDHRA PATRIKA, MADRAS.

6 పేజీలు వెల 1 అణా. హోల్ 0-1-2.

సమైక్య కృషిద్వారా సుస్థిరమైన రాష్ట్రాన్ని ఏర్పరచుకోవాలి: నాయకుల ఉద్బోధ

—3 వ పేజీ

# ఆంధ్రపత్రిక

ఆంధ్రరాష్ట్రంలో భూదాన యజ్ఞానికి శ్రీ జె. సి. కుమారప్ప ప్రారంభోత్సవం

—5 వ పేజీ

Regd. No. M. 1118 సంపుటం 39. సంచిక 354 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO. సోమవారము 30-3-1953

# రాష్ట్రంతోనే ప్రత్యేక ఆంధ్ర హైకోర్టు స్థాపనకు నెహ్రూ సుముఖత

## "యుద్ధ విరమణ సంప్రతింపులను తిరిగి ప్రారంభించాలి"

### సమితి సేనానికి ఉత్తర కొరియన్ల సూచన: అస్వస్థులైన ఖైదీల పరటాకు అంగీకారం

టోకియో, మార్చి 28: కొరియాయుద్ధంలో తీవ్రంగా గాయపడి వ్యాధిగ్రస్తులైవున్న ఖైదీల పరటాగురించి సమితి సర్వసేనాని లోగడచేసిన సూచనలను ఉత్తరకొరియా, చైనా ప్రతినిధులు ఇవాళ అంగీకరించారు.

ఈ పరటాను త్వరలోనే ప్రారంభించడానికి సమితి సైనిక కార్యాలయం సిద్ధంగా వున్నట్లు సమితి ప్రతినిధి ఒకరు వెల్లడించారు

గాయపడిన వ్యాధిగ్రస్థులైన ఖైదీల పరటాతోబాటు తిరిగి యుద్ధవిరమణ సంప్రతింపులను ప్రారంభించాలనీ, యుద్ధఖైదీల సమస్యను సాఫీగా పరిష్కరించుకొనడానికి ప్రయత్నాలు ప్రారంభం కావాలనీ ఉత్తర కొరియా, చైనా ప్రతినిధి వర్గం సమితి సేనానికి వ్రాసిన లేఖలో సూచించింది.

పానొముంజామ్‌లో ఇవాళ అప రాహ్ణం సమితి సేనాని జనరల్ మార్క్ క్లార్క్‌కు అందచేయబడిన ఈ లేఖపై ఉత్తరకొరియా తరఫున కింఇల్ సుంగ్, చైనా తరఫున పెంగ్ ఎహూ్వై సంతకం చేశారు. ఫిబ్రవరి 22 వ తేదీన జనరల్ క్లార్క్ పంపిన జాబుకు ఇది ఉత్తరకొరియన్ల జవాబని తెలుస్తున్నది.

దాదాపు పదినెలల పాటు జరిగిన తరువాత క్రిందటి అక్టోబరులో యుద్ధ విరమణ సంప్రతింపులు విరమింపబడినవి. ఏ పక్షానికి చెందిన ఖైదీలను ఆ పక్షానికి అందచేయాలని కమ్యూనిస్టులు కోరగా ఖైదీల అభిప్రాయాలను తెలుసుకొని ఆ ప్రకారం ఖైదీలను ఆయా పక్షాలకు అందచేయాలని సమితి ప్రతినిధి వర్గం పట్టుబట్టింది.

#### పాశ్చాత్యరాజ్యాల వ్యాఖ్యానం

లండన్, మార్చి 28: కొరియా యుద్ధాన్ని వీలైనంత శీఘ్రంగా విరమింప చేయాలని ప్రచ్ఛన్న యుద్ధాన్ని ఆపాలని రష్యా నిజంగానే భావిస్తున్నదని ...

(2 వ పేజీ చూడుడు)

***

#### ఫోస్టాఫీసుల్లో ఉస్మానియా నాణాలు

డైరెక్టర్ ప్రకటన

హైదరాబాదు, మార్చి 28: ఏప్రిల్ 1 వ తేదీ తర్వాత రాష్ట్ర సంస్థానంలోని అన్ని తపాలాఫీసులలోనూ యథాపూర్వం ఉస్మానియా కరెన్సీ నాణ్యాలు తీసుకుంటూనే వుంటారనీ, అయితే తాము బట్వాడా చేయవలసిన మొత్తాలు మాత్రం ఇండియా కరెన్సీనాణ్యాలలో మాత్రమే బట్వాడాచేస్తారనీ పోస్టల్ సర్వీసుల డైరెక్టరు జారీచేసిన ఒక ప్రకటనతెలుపుతున్నది.

ఇకముందు బడిబీతాలను ప్రస్తుతపు మారకపురేటు ప్రకారం ఇండియా కరెన్సీ నాణ్యాలలోనే పుచ్చుకోవడానికి విద్యాశాఖవారు నిశ్చయించినట్లు ప్రభుత్వంవారొక ప్రకటన చేశారు. అలాగే వారు తమ తాబేదార్లందరికి ఉత్తరువులు చేసినట్లుకూడ అందులో తెలుపబడింది.

***

## గ్రామసీమలోని ఉస్మానియా కరెన్సీ ఉపసంహరణకు వీలుగా మరికొంత వ్యవధి

—బిల్లులో స్వల్ప మార్పులు

న్యూఢిల్లీ, మార్చి 28: ...

#### రాజ్యసభలో ఆమోదం

న్యూఢిల్లీ, మార్చి 28: ...

***

## అసెంబ్లీ సభ్యుల అభిమతాన్ని గమనించి నిర్ణయంచేసే సూచన

### రాష్ట్ర నిర్మాణ వ్యవహారంపై డా॥ కట్జూతో సంజీవరెడ్డి చర్చలు

న్యూఢిల్లీ, మార్చి 28: మద్రాసు అసెంబ్లీలోని ఆంధ్ర కాంగ్రెస్‌పార్టీ నాయకుడు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు నిన్న ప్రధానమంత్రి నెహ్రూను కలుసుకొని ఆంధ్రరాష్ట్రానికి మొదట్నుంచే ప్రత్యేక హైకోర్టును ఏర్పాటు చేయవలసిందిగా కోరారు. [ఈ విషయాన్ని ఆంధ్రపత్రిక సంగ్రహంగా నిన్ననే ప్రకటించింది]

ఆంధ్ర అసెంబ్లీ మెంబర్లు ఈ విధంగా తీర్మానిస్తే కేంద్రప్రభుత్వం తననిర్ణయాన్ని మార్చుకొని ఆంధ్రకు మొదట్నుంచే ప్రత్యేక హైకోర్టును స్థాపించడానికి చర్యలు తీసుకోగలదని పండిట్ నెహ్రూ ... చెప్పినట్లు తెలుస్తున్నది.

కేంద్రప్రభుత్వ ప్రకటన ప్రకారం ఆంధ్ర అసెంబ్లీ సభ్యులు జులై 1వ తేదీ లోగా ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని ఎక్కడో నిర్ణయించవలసి వున్నది. ఆ నిర్ణయంతో బాటే ప్రత్యేక హైకోర్టును గురించి కూడా తీర్మానం చేయవచ్చునని ప్రధాని మంత్రి నెహ్రూ శ్రీ సంజీవరెడ్డిగారికి సలహా ఇచ్చినట్లు తెలుస్తున్నది.

ప్రధానమంత్రి నెహ్రూ ప్రకటనలో పస్పష్టం ...

***

#### కృష్ణ రెగ్యులేటర్ వెంటనే నిర్మించాలని మున్సిపల్ కౌన్సిలు అభ్యర్థన

విజయవాడ, మార్చి 28: అనవసరమైన కాలవిలంబన యేమీ లేకుండా కృష్ణానదికి రోడ్డు-బ్రిడ్జి,-రెగ్యులేటరును వెంటనే నిర్మించాలని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ నిన్న సాయంకాలం విజయవాడ పురపాలక సంఘంవారు తీర్మానించారు. ఛైర్మన్ డాక్టరు తెన్నేటి చలపతిరావుగారు సమావేశానికి అధ్యక్షత వహించారు.

వించిపేట, పి. డబ్ల్యు డి. వర్క్ షాపు, ఏలూరు రోడ్డుమీద బస్సు స్టాండువద్ద, గాంధినగర్, సత్యనారాయణపురంలవద్ద మొత్తం రు. 23,400 ల ఖర్చుతో విద్యుచ్ఛక్తి సబ్‌స్టేషనులను ఏర్పాటు చేయుటకుగూడ తీర్మానించబడింది.

***

## రాష్ట్రరాజధాని నిర్ణయంలో ఆంధ్ర కాంగ్రెస్ సభ్యులకు సంపూర్ణస్వేచ్ఛ

(ఆంధ్రపత్రిక విలేఖరి)

విజయవాడ, మార్చి 29: ఏప్రిల్ 1 తేదిన ఇక్కడ జరుగనున్న ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని నిర్ణయ సందర్భమున మదరాసు అసెంబ్లీలోని ఆంధ్రకాంగ్రెసు శాసన సభ్యులకు ఎట్లాంటి ఆదేశం ఇవ్వక పోవచ్చుని శ్రీ కళా వెంకటరావుగారు నిన్న రాత్రి ఇక్కడ ఆంధ్రపత్రిక ప్రతినిధితో చెప్పారు.

ఏప్రిల్ 1 తేదీన జరుగనున్న కార్యవర్గ సమావేశమునకు హాజరు కావలసిందని శ్రీ కళా వెంకటరావు- శ్రీ మరుపిళ్ల చిట్టి శ్రీ కల్లూరి చంద్రమౌళి మదరాసు ప్రభుత్వంలోని తెలుగుమంత్రులకు ప్రత్యేకముగ ఆహ్వానములు వెళ్లినట్లు తెలుస్తున్నది.

#### కాశ్మీర్‌లో భూకంపం

శ్రీనగర్, మార్చి 28: కాశ్మీరులో ఇవాళ రాత్రి ఒంటిగంటన్నరకు మళ్లీ భూకంపం వచ్చింది. ఈ రెండురోజులలో ఇక పభూమికంపించటంఇదిఅరో సారి.

***

#### దక్షిణాఫ్రికా ప్రభుత్వ దుష్టశాసనాలు

పార్లమెంటులో ప్రధానివివరణ

న్యూఢిల్లీ, మార్చి 28. "ప్రత్యేక ప్రాంతాల చట్టం నేటాలు, ట్రాన్స్‌వాల్, కేప్ ఆఫ్ గుడ్ హోప్ రాష్ట్రాలలో 30-6-51 వ తేదీన అమలులోకి వచ్చింది; ఆరంజ్ ఫ్రీ స్టేట్‌లో 31-10-52వ తేదీన అమలుకు వచ్చింది. ఈ చట్టం వల్ల డర్బాన్‌లో 1,46,000 మంది భారతీయులకు కేప్‌టౌన్‌లో 8000 మంది భారతీయులకు దెబ్బ తగులుతుంది. డర్బాన్‌లో భారతీయులని మొత్తం 3 కోట్ల పౌన్ల కిమ్మతుచేసే ఆస్తి ఈ చట్టంవల్ల దెబ్బతింటుంది" అని ప్రధానమంత్రి నెహ్రూ పార్లమెంటులో ఈ వేళ ఒక సభ్యుని ప్రశ్నకు సమాధానంగా వెల్లడిచేశారు.

దేశంలో మేలిరకం ఉప్పు తయారు కాగలందులకై ప్రభుత్వం ఉప్పు పండించే ప్రాంతాలలో ముఖ్యంగా మద్రాసు, ఒరిస్సా, తిరువాన్కూర్ కొచ్చిన్ రాష్ట్రాలలో కొన్ని నమూనా ఫ్యాక్టరీలను లాబరేటరీలను నెలకొల్పదలచిందనీ, భావనగర్‌లో ఒక కేంద్ర లవణ పరిశోధనాలయాన్ని కూడా ఏర్పాటు చేయనున్నట్లు ఉత్పత్తి శాఖామంత్రి కె. సి. రెడ్డిగారు ప్రకటించారు.

ఈయేడాది పాకిస్తాన్ నుంచి యింతవరకు 11 లక్షల బేళ్ల జనుము దిగుమతి చేయబడిందనీ, పాకిస్తాన్ నుంచి జనుము దిగుమతి చేయటంవల్ల ఇండియాలో జనుము ధరలలో మార్పేమీ రాదని, వాణిజ్యశాఖా మంత్రి కృష్ణమాచారిగారు అన్నారు.

భారతదేశం నుంచి బట్టల ఎగుమతులను అభివృద్ధిచేసే మార్గాలనుపరిశీలించడానికీ, ఎగుమతులకు సంబంధించిన సమస్త వ్యవహారాలను పర్యవేక్షించడానికై ఒక ప్రత్యేక వ్యవస్థను ఏర్పాటు చేయాలన్న ప్రతిపాదనను ప్రభుత్వం పరిశీలిస్తున్నదని కూడా కృష్ణమాచారి గారు తెలియజేశారు.

***

## అమెరికా సాంకేతిక సహాయానికి బర్మా తిరస్కృతి

### తమ తాటస్థ్య ప్రతిపత్తికి భంగం కలుగుతున్నందువల్ల నిర్ణయం

రంగూన్, మార్చి 28: సాంకేతిక సహకార ఒడంబడిక ననుసరించి తమకు చేస్తున్న సహాయాన్ని మానివేయవలసిందిగా అమెరికాకు బర్మా 3 మాసాల నోటీసుఇచ్చింది.

బర్మా ప్రభుత్వ ఈ నిర్ణయాన్ని విదేశాంగమంత్రి అమెరికా రాయబారికి తెలియచేశారు.

ఆయన ఈ విధంగా తెలియచేశారు: అమెరికా ప్రభుత్వం మాకు చేస్తున్న సహాయం ఈవిడాది జూను 30 తర్వాత మాకుఅవసరంలేదని తెలుపుతున్నాము. మన ఉభయదేశాలూ చేసుకొన్న ఆర్థిక సహకార ఒడంబడికలోని 5-వ షరతు ననుసరించి అమెరికా ప్రభుత్వం ఈ నోటీసును తీసుకోవలసిందిగా కోరుతున్నాము. ఇంతవరకూ ఈ ఒడంబడిక ననుసరించాం. అమెరికా చేసిన సహాయానికి కృతజ్ఞులము. ఈ చర్య ప్రస్తుతం జరుగుతున్న కార్యక్రమం పట్లగానీ, సాంకేతిక సహకారం చేస్తున్న వ్యక్తుల కార్యకలాపాల పట్లగానీ ...

***

#### మాస్కోలో అమెరికన్ రాయబారి

బొహ్లెన్ నియామకానికి సెనేట్ ఆమోదం

వాషింగ్టన్, మార్చి 28: రష్యాలో అమెరికన్ రాయబారిగా ఛార్లెస్ బోహ్లెన్‌ను నియమించాలనే ప్రతిపాదనను సెనేట్ నిన్న అత్యధిక సంఖ్యాబలంతో ఆమోదించింది. ప్రతిపాదనకు అనుకూలంగా 74 మంది, వ్యతిరేకంగా 13 గురు వోటు చేశారు.

ఈ నియామకం విషయమై సెనేటర్ మెకార్థీ వర్గానికీ ఐసెన్‌హోవర్‌కూ తీవ్రమైన అభిప్రాయ భేదాలు వచ్చాయి.

***

## సూడాన్ గవర్నర్ జనరల్‌కు సలహా సంఘ నియామకం

### బ్రిటిష్ మంత్రితో మంతనాల అనంతరం ఈజిప్ట్ ప్రభుత్వ ప్రకటన

కైరో, మార్చి 28; సూడాన్ గవర్నర్ జనరల్‌కు ...

***

## సమితికి బర్మాఫిర్యాదును ఇండియా బలపరుస్తుంది

### ప్రధాని నెహ్రూ స్పష్టీకరణ

కలకత్తా, మార్చి 28: ...

#### సరిహద్దు పర్యటనోద్దేశ్యం

#### నెహ్రూ అండమాను ప్రయాణం

***

#### ఆదోనిలో రైళ్ల అటకాయింపు

కన్నడిగుల చర్య

***

**అబలసుధ** స్త్రీల సమ స్యలను ...

***

# సహైక్య కృషిద్వారా సుస్థిరమైన ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేసుకోవాలి

## నెల్లూరు బహిరంగ సభలో కాశేశ్వరరావు, గోపాలరెడ్డి, తిరుమలరావుగారల ఉద్బోధ

నెల్లూరు, మార్చి 28: తాత్కాలిక ఆంధ్ర రాజధాని విషయంలో ప్రధాని నెహ్రూ ప్రకటనపట్ల నిన్న సాయంకాలం ఇక్కడ జరిగిన బహిరంగసభలో శ్రీయుతులు అయ్యదేవర కాళేశ్వరరావు, ఎం. తిరుమలరావు, బెజవాడ గోపాలరెడ్డి గారలు అసంతృప్తి వెల్లడించారు. అయితే ఈ విషయంలో ప్రస్తుతం ఆంధ్రులు వ్యతిరేకవైఖరి నవలంబించినట్లయితే: భావితరాలవారు నిందించేటందుకు వీలుగా ఆంధ్రరాష్ట్రావతరణ ఆగిపోగలదు సుమా అని కూడా వీరు హెచ్చరిక చేశారు.

రెండు మూడు నెలలలో ఉభయపక్షాల ఆవేశాలు తగ్గిపోగలవు కనుక ఈ విషయం గురించి ప్రధాని నెహ్రూ అప్పుడు పునఃపరిశీలన జరిపే అవకాశ ముందని శ్రీయుతులు తిరుమలరావు, గోపాలరెడ్డిగారలు అభిప్రాయపడ్డారు.

చెప్పటం ఆయన అలవాటుగా కనిపిస్తున్నదని కాళేశ్వరరావుగారు అన్నారు. బళ్ళారి జిల్లాను గురించి కన్నడులు తగాదా పడడం సమంజసం కాదన్నారు.

...అందులు ఇతోధికంగా సహకరించాలన్నారు. ప్రాంతీయాదిఅభిమానాలను స్వస్తిచెప్పి ఆంధ్ర ప్రజాస్వామిక పక్షాలన్నిటిమధ్య సన్నిహిత సహకారం సముపార్జించడానికి ఆంధ్రులు కృషి చెయ్యాలని కూడా గోపాలరెడ్డిగారు తమ ప్రసంగంలో అన్నారు.

తిరుమలరావుగారు ప్రసంగిస్తూ ఆంధ్రులలో ఐకమత్యం లేకపోవడంకోచనీయమనీ, తమిళుల విజయానికి కారణం ఆంధ్ర నాయకుల అనైకమత్యమేననీ అన్నారు. హైదరాబాదు సంస్థానాన్ని విభజించవలసిన అవసరాన్ని ప్రధాని నెహ్రూ ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారలుకూడా గుర్తించారు కనుక ఇక ఆ సంస్థానం విభజించబడడం అనేది ధ్రువమనికూడా తిరుమలరావుగారన్నారు. ప్రస్తుత మదరాసురాష్ట్ర మంత్రివర్గంలో రాజాజీ మాటను కాదనగలవారెవరూ లేరని కూడా తిరుమలరావుగారన్నారు.

శ్రీ వాంచూ చేసిన న్యాయమైన సూచనలను త్రోసిరాజనడం ద్వారా కేంద్రప్రభుత్వం ఆంధ్రులకు చాలా అన్యాయం చేసిందంటూ కాళేశ్వరరావుగారిలా ప్రసంగించారు:

"ఆంధ్రులకు తమిళులపట్ల ద్వేషమేమీ లేదు. ఆంధ్రరాజధానిని తాత్కాలికంగా మద్రాసు నగరంలో నెలకొల్పడంవల్ల ఏదో సమస్య ఉత్పన్నం కాగలదన్న భయానికి ఆస్కారం కనిపించదు. ఆంధ్రరాష్ట్రోద్యమం సందర్భంలో డిసెంబరు 16వ తేదీన జరిగిన ప్రదర్శనలే యిందుకు నిదర్శనం. ముఖ్యమంత్రి రాజాజీ బెదిరింపులకు ప్రధాని నెహ్రూ లొంగిపోయినారని నా అభిప్రాయం."

...జనస్థలమైన హోసూరు ఆంధ్రప్రాంతమేనని కాళేశ్వరరావుగారన్నారు. ఆంధ్రరాజధానిని గురించి మద్రాసు గవర్నరు శ్రీప్రకాశ తన పర్యటనలో యిటీవల చేసినసూచనలను గురించి ప్రస్తావిస్తూ, విశాఖపట్టణానికి వెళ్ళితే అపట్టణమే ఆంధ్రరాజధానికి తగినపట్టణమని...

## పొగాకు వర్తకుల హర్తాల్

### విక్రయంపన్ను విధింపుపట్ల అసమ్మతి

పలాస, మార్చి 26: మదరాసు ప్రభుత్వం పొగాకుపై విధించనున్న అమ్మకం పన్నుపట్ల అసమ్మతి సూచకంగా మరికొన్ని చోట్ల పొగాకు వర్తకులు హర్తాళ్ళు, సభలు జరుపుతున్నారు.

పలాస పొగాకు వర్తకులు 23న శ్రీకబ్బి జగన్నాథంగారి అధ్యక్షతన సమావేశమై పొగాకుపై విధించనున్న అమ్మకం పన్నును తమ వ్యతిరేకతను తెలియజేస్తూ తీర్మానించారు. ఈపన్నువలన అనేక పేద, మధ్య తరగతి కుటుంబాలు దెబ్బతిన గలవనీ, విద్యాహీనులైన అనేక మంది చిన్న తరగతి...

...సర్వసభ్య సమావేశం 22న శ్రీ కె. గయ్యాలస్వామిగారి అధ్యక్షతన జరిగినది. పొగాకుపై విధించబోయేపన్నువలన అనేక మధ్య తరగతి వర్తకులు ప్రజలు నష్టపడగలరనీ, ముఖ్యంగా విద్యావంతులు కానివారిని యీ విధానం చాలా ఇబ్బందులకు గురిచేస్తుందనీ కేంద్ర ఆదాయం తగ్గడమే గాక, ఉత్పత్తి నిలిచిపోతుందనీ అభిప్రాయపడుతూ యీ క్రొత్త పన్నులు ఉపసంహరించాలని కోరుతూ తీర్మానించారు. 3 రోజులపాటు దుకాణాలు మూసివేయాలని తీర్మానించారు.

సోంపేట పొగాకువర్తకుల, ఉత్పత్తిదారుల సమావేశం శ్రీ వేకాల అప్పారావుగారి అధ్యక్షతన 25 తేదీ జరిగినది. రాష్ట్ర ప్రభుత్వ విధానం చాలా అన్యాయమనీ, పొగాకు ఉత్పత్తికి, యిది తీరనినష్టం కలిగిస్తుందనీ, రైతులు చాలా నష్టపడ తేరనీ, వేలకొద్దీ కుటుంబాల జీవనోపాధి పోయి వారు కొత్త మార్గాలను వెతుక్కోవలసివస్తుందనీ, కనుక యీ పన్ను లు విధించరాదనీ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు. 3 రోజులు అనగా 23, 24, 25 తేదీలలో అంగళ్లు మూసివేశారు. అసమ్మతి సభలలో శ్రీయుతులు ప్రసాద వరలింగం, కనిశెట్టి అప్పలస్వామి, మాదుగుల జగన్నాథం గార్లు ప్రభుత్వవిధానాన్ని తీవ్రంగా విమర్శిస్తూ మాట్లాడారు.

## చెన్నపురి తెలుగు సమితి

మదరాసు, మార్చి 28 మదరాసు నగరవాసులు కొందరు డా॥ ఎ. పట్టాభి అధ్యక్షతన సమావేశమై నగరంలోని తెలుగుమాట్లాడే ప్రజలకు విద్యాజ్ఞానము, సాంఘిక విషయాలలో సౌకర్యాలను అభివృద్ధిచేయుటకు "చెన్నపురి తెలుగుసమితి" అనే పేరుతో ఒక సంస్థను ఏర్పాటుచేసి దానికి శ్రీ సి. శ్రీరాములుగారిని కన్వీనరుగ నియమించారు.

తెలుగు మాట్లాడేవారందరు సమితి సభ్యులుగ చేరాలని శ్రీ సి. శ్రీరాములు విజ్ఞప్తిచేశారు.

## కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థ

### మార్పు చెందాలని కేంద్రసంఘ నిర్ణయం

బొంబాయి, మార్చి 27: ఈ వేళ యిక్కడ ప్రారంభమైన కమ్యూనిస్టు పార్టీ కేంద్రసంఘం సమావేశంలో, దేశరాజకీయపరిస్థితినిగూర్చి స్థూలంగా చర్చజరిగింది. పార్టీకార్యదర్శి ఎ. కె. ఘోష్ అధ్యక్షతవహించారు.

కమ్యూనిస్టుపార్టీ వ్యవస్థలో తగిన మార్పులు చేసి పార్టీని పునరుజ్జీవింపచెయ్యాలని సభ్యులు అభిప్రాయపడుతున్నట్లు తెలియవచ్చింది. పార్టీఅనుసరించవలసినభవిష్యత్ కార్యక్రమాన్ని కేంద్రసంఘం ఈ సమావేశంలోతయారు చేయగలదని తెలుస్తున్నది. ఇవాళ ప్రారంభమైన కేంద్రసంఘం సమావేశం వారంరోజులపాటు జరుగుతుంది.

## తిరుపతిలో బియ్యం ధర పెరుగుదల

తిరుపతి, మార్చి 27: పట్టణంలో బియ్యంధర పడికి అ 15ల నుంచి రూపాయి వేసేవరకు పెరిగింది. నూనెధరలుకూడా పెరుగుతున్నవి. ప్రభుత్వం...

## శ్రీరామనవమి సందర్భంలో 'పాపాయి' ఔట్‌డోర్ షూటింగ్

...పాపాయి చిత్రం ఔట్‌డోర్ షూటింగు జరిగింది. నాయిక సోదరి ఒక తప్పిపోయిన చంటిపిల్లను తనతో తీసికొని వెళ్ళడం ఆమె గోదావరిలో స్నానం చెయ్యడం మున్నగు దృశ్యాలు షూట్ చేశారు. స్వ. వి.

...సుస్థిరాంధ్ర రాష్ట్రమేర్పడి అభ్యుదయపథంలో పురోగమించడానికి వీలుగా ఆంధ్ర యువకులు ముందుకు వచ్చి తమవంతు బాధ్యతలు నిర్వర్తించాలని గోపాలరెడ్డిగారు తమఉపన్యాసంలో అన్నారు. (స్వ. వి)

# మైకా కార్మికుల గృహవసతి

## యజమానులకు మంత్రి గిరిగారి హెచ్చరిక

(స్వకీయ విలేఖరి)

గూడూరు, మార్చి 27: "మైకాగనులలో పనిచేసే కూలీలకు గృహవసతి యేమాత్రమూ బాగుండలేదని, త్వరలో చక్కని ఇండ్లను, గనుల యజమానులు తమంతతామే కట్టించియివ్వాలని లేకపోతే ప్రభుత్వం జోక్యం కల్పించుకోవలసివస్తుందని, కేంద్ర ప్రభుత్వ కార్మికశాఖామంత్రి, శ్రీ వి. వి. గిరిగారు మొన్న మధ్యాహ్నం యిక్కడ మైకాగనుల యజమానులసమావేశంలో ప్రసంగిస్తూ హెచ్చరించారు.

మైకావ్యాపారస్థులు తమ వ్యాపారాభివృద్ధికిచేసిన సూచనలను శ్రద్ధతో పరిశీలిస్తామని, యజమానులు కూలీలు, తమతమసమస్యలను సామరస్యంగా పరిష్కరించుకోవడం మంచిదని చెప్పారు.

మైకాగనుల కార్మికుల స్థితిగతులను స్వయంగా తెలుసుకొనే నిమిత్తం గిరిగారు, మొన్న గూడూరువచ్చి, అక్కడినుండి బయలుదేరి సైదాపురం, సామైను, తలుపూరు కలిచేడు ప్రాంతాలలోని గనులు చూచారు. అక్కడ కూలీలకోసం యేర్పాటు చేయబడిన ఆసుపత్రులు, పాఠశాలలు, కూలీలబిడ్డలకోసం కట్టిన విశ్రాంతి భవనాలు...

...కలిచేడువద్ద కార్మికులు, తమకు ప్రభుత్వం కనీస వేతనాలు నిర్ణయించినా, కొందరు యజమానులు ఆ ప్రమాణానికి తగ్గించియిస్తున్నారని, జొన్నగనుల కూలీలకువలెనే, తమకు ప్రావిడెంటుఫండు సౌకర్యం కల్పించాలని, ఆడువారు గనులలోపల పని చేయుటకు తగిన వసతులు కల్పించాలని కోరారు. మైనర్లను, స్త్రీలను గనులలోపల పనిచేయించుట – అంతర్జాతీయ సూత్రాలకు విరుద్ధమని, కొబట్టి కూలీలు అట్టి కోర్కెలు విరమించుకోవాలని సలహాయిచ్చారు.

గిరిగారు సామైనులోకిదిగి, మైకా తీయుపద్ధతిని గమనించారు. గాలిని గనిలోకి పంపుటకు గనిప్రక్కనే అమర్చబడిన యంత్రాన్ని చూచారు. కూలీలకు కట్టబడిన గుడిసెలు కూడా చూచారు. గుడిసెలు అంత సౌకర్యంగా లేవని మంత్రిగారు అభిప్రాయపడినట్లు తెలుస్తున్నది. గనుల ప్రాంతాల ఆస్పత్రులలో కూడా చాలా మార్పులు అవసరమని అభిప్రాయపడ్డారు.

సామైనులో పిల్లల వసతిగృహానికి ప్రారంభోత్సవం చేశారు.

కలిచేడు గనివద్ద తిక్కవరపురామిరెడ్డిగారు, దక్షిణఇండియా మైకా గనులవారిపక్షాన వినతిపత్రం సమర్పిస్తూ, ఆదర్శప్రాయంగా ఉండేటట్లు ప్రభుత్వం ఒకటి రెండు మైకాగనులను స్వయంగా నడపడం మంచిదని కోరారు.

నెల్లూరుజిల్లా కాంగ్రెసు కార్యదర్శి జన్నెలగంటి రాఘవయ్యగారు గిరిగారికి వినతిపత్రం సమర్పిస్తూ, బంగారు, బొగ్గు గనులలో పనిచేసే కార్మికులకు యేయేవసతులుంటాయో, ఆ వసతులను మైకాగనుల కార్మికులకు కూడా కల్పించాలని కోరారు.

## నెల్లిమర్ల, చిట్టివలస కార్మికుల తగాదా

### కరువు భత్యంపై ట్రిబ్యునల్ తీర్పు

మదరాసు, మార్చి 28: "తగాదా పరిష్కారమునకు పంపబడి నప్పటినుండి అంటే 1952 అక్టోబరు 13 నుండి నెల్లిమర్ల, చిట్టివలస జ్యూట్ మిల్లు కార్మికులకు విశాఖపట్నం జీవనవ్యయసూచికననుసరించి 100 పాయింట్లకు పైబడిన ప్రతిపాయింటుకు 2 అణాల 5 పైసలు చొ॥న కరువుభత్యం చెల్లించాలని" నెల్లిమర్ల, చిట్టివలస జ్యూట్ మిల్లు కార్మికులకు యజమానులకు మధ్య ఏర్పడినతగాదాను పరిష్కరించి ట్రిబ్యునల్ తీర్పుఇచ్చింది.

ట్రిబ్యునల్ తీర్పులో ఇంకా ఇట్లావుంది: "208 గంటలు లేక 26 రోజుల సెలవు కనీసమంజూరీ రు 23 నుండి 26 వరకు నిర్ణయించి 1952 డిసెంబరు 31 వరకు రు 23 లు 1954 జనవరి 1 నుండి 1954 డిసెంబరు 31 వరకు రు 24 లు, 1955 జనవరి 1 నుండి డిసెంబరు 31 వరకు రు 25 లు, 1956 జనవరి 1 నుండి డిసెంబరు 31 వరకు రు 26 లు చొప్పున చెల్లించాలి. కొత్తగ పనిలో చేరేవారికి కూడ ఆసంవత్సరమునకు నిర్ణయించిన కనీస మజూరీ ప్రమాణంలో మజూరీలు ఇవ్వాలి. దీనిని జీతము పెంపుదలగ పరిగణించుటకు వీలులేదు. ఈవిధముగ నిర్ణయించిన కనీసమజూరీలను 1952 అక్టోబరు 13 నుండి చెల్లించాలి. ప్రతి నెలా కార్మికులకు ఇస్తున్న రు 4-7.0 ల విలువగల ధాన్యపు అలవెన్సును ఇస్తూనే వుండాలి, దీనిని కరువుభత్యంలో సరిచూసుకోవచ్చును. ఫలహారశాల సిబ్బందికి కూడ కరువు భత్యం ఇవ్వాలి. కాని సంచుల విలువ రు 11-6-0 లను కరువు భత్యంనుండి మినహాయించవచ్చును.

నెల్లిమెర్ల జ్యూట్ మిలు కార్మికులకు ప్రాతిపదిక మజూరీలను బట్టి 1950కి 1/5 వంతు 1951కి 5/6 వంతున్నూ, చిట్టివలసమిల్లు కార్మికులకు 1950కి 1/15 1951కి 3/5 వంతు బోనసు చెల్లించాలి.

మహంతి కృష్ణమ్మ రామిశెట్టి నారాయణ బర్తరఫు సక్రమం గాదని వారిని పనికాలమునుండి జీతము ఇచ్చి తిరిగి పనిలో చేర్చుకోవాలని అన్నారు.

## కాళహస్తిలో ఇర్రిగేషన్ పనులు

తిరుపతి, మార్చి 27: కాళహస్తి, చంద్రగిరి ప్రాంతాలలో యిర్రిగేషన్ పనులు చురుకుగా సాగుతున్నవి. ఇప్పటికి కాళహస్తి తాలూకాలో 32, చంద్రగిరి తాలూకాలో 17 పనులు పూర్తయినవి. మరికొన్ని జరుగుతున్నవి. కట్టుబాటుదారులు, పని కార్మికులు దొరకనందున సరిగా జరుగుట లేదని యింజనీరింగు శాఖకు తెలియచేశారు. (స్వ. వి.)



ప్రథమశ్రేణికి చెందిన బ్రిటిషు క్రికెట్ ఆటగాడు లెన్ హటన్ 1952వ సంవత్సరం చాంపియన్‌గా ఆయన బహుమతి పొందినప్పటి ఫోటో.

# ఇండియా - వెస్ట్ ఇండీస్ క్రికెట్ ఆఖరి టెస్ట్

## మొదటిరోజున ఇండియా జట్టుకు 3 వికెట్ల నష్టానికి 216 పరుగులు

కింగ్‌స్టన్, మార్చి 28: ఇండియా వెస్ట్ ఇండీస్ క్రికెట్ ఆఖరి టెస్ట్ నేడిక్కడ ప్రారంభమైంది. ఆట ముగిసేసరికి ఇండియా జట్టు 3 వికెట్ల నష్టానికి 216 పరుగులు తీశారు.

ఇండియా స్కిప్పర్ హజారేటాస్ గెల్చి ఆప్టే, రాయ్‌లతో ఆట ప్రారంభించాడు. ఆప్టే 15 పరుగులుతీసి రన్ ఔట్ అయిపోయాడు. రాయ్‌మాత్రం రోజల్లా ఆడి 81 పరుగులుతీసి అవుటు కాకుండా నిలిచాడు. ...



## ఇన్విటేషన్ హాకీ

## ఆంధ్ర వ్యాయామ కళాశాల స్పోర్ట్స్ ఫెస్టివల్

## వైన్యాన్యాలు అటల పోటీలు

## విలువిద్యా ప్రదర్శనం

## జ్యూట్ కంట్రోలు

## దక్షిణాఫ్రికా జాతి వివక్షతా విధానం

### పరిశీలనా సంఘంలో బంచ్ పాల్గొనే అవకాశం లేదట

సమితి, మార్చి 28: దక్షిణాఫ్రికా ప్రభుత్వజాతి వివక్షతా విధానాలను పరిశీలించడానికి నియుక్తమైన కమీషన్‌లో డాక్టర్ రాల్ఫ్ బంచ్ పాల్గొనజాలరని తెలిపింది. ఈయనను బదులు మరొకరిని వేసే అంశం పరిశీలనలో వుంది. బంచ్ కమీషన్‌లో పాల్గొనేదుకు వీలుగా ధర్మకర్తృత్వ సంఘ డైరక్టరు బాధ్యతలనుంచి ఆయనను తప్పించవలసిందని ఆసియా అరబ్బు రాజ్యాల బృందం తొలుత ఉపసంఘం ఒకటి సమితి అధ్యక్షుడు లెస్టర్ పియర్సన్‌ను కలుసుకొని కోరింది. ధర్మకర్తృత్వ సంఘం జూన్‌లో సమావేశం కానున్నందున బంచ్ కమీషన్‌లో పాల్గొనే అవకాశం ఉండజాలదని కార్యదర్శిలీ తెలిపినట్లు పియర్సన్ చెప్పారట.

## కాశ్మీర్ పూర్వ మహారాజు భరణం

### పూర్తిగా కేంద్రమే భరిస్తున్నది

న్యూఢిల్లీ, మార్చి 27: కాశ్మీర్ పూర్వ మహారాజు హరిసింగ్‌కు కేంద్రప్రభుత్వ మిస్తున్న భరణం నిధికి కాశ్మీర్ ప్రభుత్వం ఏమీ ఇవ్వడంలేదని రాష్ట్రాలమంత్రి డాక్టర్ కె. ఎన్. కట్జూ నేడు ప్రజాసభలో తెలిపారు.

కాశ్మీర్ ఇండియాలో చేరినప్పుడు ఈ భరణంపాలుకు రూ 15/-లక్షలని నిర్ణయించాము. అందులో 6 లక్షలు కాశ్మీర్ ప్రభుత్వము, 9 లక్షలు భారత ప్రభుత్వము చెల్లించాలని ఏర్పాటు. దరిమిలాను సర్దార్ రియాసత్ పదవి ఏర్పడిన పిమ్మట ఈ భరణం 10 లక్షలకు తగ్గించబడింది. అప్పటినుంచీ రాష్ట్రప్రభుత్వం ఏమీ ఇవ్వడంలేదు ఆర్థికంగా భారతదేశంతో సంఘటితమైపోయిన రాష్ట్రాలు తమ పూర్వ ప్రభువులకిచ్చే భరణాలలో కొంత భాగం భరిస్తున్నాయనీ, కాశ్మీర్ విషయంలో అట్టిసంఘటన జరగలేదనీకూడా కట్జూ అన్నారు.

## రష్యాలో ఖైదీల విడుదల

### కొందరికి శిక్ష తగ్గింపు

మాస్కో, మార్చి 28: ...సంవత్సరాలకు లోపు శిక్షలు ఉన్న ఖైదీలందర్నీ రష్యన్ ప్రభుత్వం ఈవేళ విడుదల చేసింది అంతేకాక పైగా శిక్షలు విధించబడిన వారివిషయంలో శిక్షా కాల పరిమితి సగానికి సగం తగ్గించి వేయబడింది. ...

